# శ్రీ వేంకటేశ్వర శతకము





మ॥ కలిలో శ్రీపతి వేంకటేశ్వరుడె సాక్షాత్ దైవతంబన్న ప
ల్కుల నాలింపుడి, వాని కెల్లపుడు మ్రొక్కుల్ సల్పు డద్దాన మీ
రలు సంసారమహాబ్ధి నీదదగు భారం బాతడే మోయు, జిం
తల వంతల్ దిగమ్రింగి హాయిగనరాదా ! భారతీయ ప్రజల్.

మహాకాళి వేంకటేశ్వరరావు

శ్రీ

అవిఘ్నమస్తు

శ్రీ వేంకటేశాయనమః

# శ్రీ వేంకటేశ్వర శతకము

శ్రీచలితాబ్జనేత్ర, యతసీసుమ కోమలగాత్ర, సర్వథా
త్రీచర జంతుపోషణ, సుధీజన మంజుల దివ్యభాషణా
ఖేచర సిద్ధసాధ్య సురకిన్నర యక్షవిచిత్రవేష, శే
షాచలవాస, గైకొనుజోహారులు, శ్రీపతి వేంకటేశ్వరా! ౧

నీ చరితంబు చూడ మహానీయము మోక్షఫలప్రదంబునౌ
నీ చరణాబ్జసేవమె పునీతునిగా నను జేయునంచు, నఁ
గాచిన నీవ కావవలెఁ గర్మవిమోచన గల్గునంచు గేల్
సాచి నమస్కరించితి ప్రసన్నుఁడ గాఁగదె! వేంకటేశ్వరా! ౨

ఏచదువుల్ పఠించిన మఱెట్టి కళాభ్యసనంబు జేసినఁ
జూచిన నెట్టి గ్రంథములు శోభగలంగదు దాననెందు; నిఁ
నోచినగాని మానవ మనోరథముల్ ఫలియింపవెందు, శే
షాచలవాస మ్రొక్కెద దయామతిజూడవె! వేంకటేశ్వరా!

కరివరదుండె యా కృతయుగంబున దైవమనంగ 'త్రేత' యం
దరయగ దైవమా గురుదయానిధి శ్రీరఘురాముడంద్రు ద్వా
పరయుగమందు కృష్ణభగవానుడెయా; కలియందు వేంకటే
శ్వరుఁడె యదార్థదైవమని పల్కెద రీభువి; వేంకటేశ్వరా! ౪

అతివిమలంబు బూజ్యము మహాద్భుతమైన భవద్యశోబ్ధియం
దతిమలినంబు హేయము భయాంధువు మామక కిల్బిషంబు,తూ
ళిత మొనరింపనెంచితి; మలీమసుడంచుఁ ద్యజింపఁబోక, స
న్మతి గనుమయ్య నీకివె నమస్సులు! శ్రీపతి వేంకటేశ్వరా!

కర మవివేకులై సకల కష్టములంది భవార్ణవంబునన్
దెలివు తొలంగి నెమ్మనము దేకువదక్క ప్రలాపి వైఖరిన్
దిరిగెడి మానవాధముల దిన్నని యొడ్డుల జేర్పనోపు మేల్
తరణివి నీవెగా! భవవిదారణ శ్రీపతి వేంకటేశ్వరా. ౬

చేసిన దోసముల్ గణనసేయగరానివి తండ్రి వానికై
గాసిలజేయకయ్య నరకమ్మున నన్ బడద్రోయకయ్య, నీ
దాసుఁడనంచు దప్పితపు దారుల బోవ నటంచు నిప్పుడే
దోసిలినొగ్గినాడఁ గనుదోయిని విప్పుము, వేంకటేశ్వరా! ౭

పరధనముల్ హరించి పరభామలనెంచి ముదంబునొందు ము
ష్కర నరు జీవితంబు కొఱగానిదికాదె! తలంపగా భవ
చ్చరణ యుగంబె దిక్కనుచు సాకెకునమ్మి త్వదీయనామసం
స్మరణము జేసి తా బ్రతుకఁజాలదె! శ్రీపతి వేంకటేశ్వరా! ౮

దురితములెన్నొ చేసెనని దూఱి మహానల ఘోరజంతు భీ
కర నరకాబ్ధి ద్రోసెదొ, యికన్ గరుణించి భవద్విశాల మే
దుర కరుణాకటాక్ష శుభలోయములందున దేల్చెదో, మతే
కరణి నొనర్చువాడవొ, జగత్ప్రభు ? శ్రీపతి వేంకటేశ్వరా

బుధజనసేవ నే నెఱుఁగ బుణ్యకథాశ్రవణం బెఱుంగ, స
ద్విధి పరిశీలనం బెఱుఁగ దేవహితంబగు కార్యజాలపుం
విధుల నెఱుంగ, నెంతయు వివేకవిహీనుఁడనైతి నిట్టి యీ
యధముని నెట్లు బ్రోచెదో దయామతి! శ్రీపతి వేంకటేశ్వరా!

ఆశకు మేర లేదు కనకాచలతుల్య ధనం బొసంగి పృ
థ్వీశుని జేసినన్ ధనవిహీనుని కైవడి దేవురించి, పే
రాశవహించుచుండు; భవదంఘ్రి సరోజములన్ స్మరించి, ఆ
శాశని బాసి హాయిఁగనఁ జాలదె! శ్రీపతి వేంకటేశ్వరా!౧౧

చదువుల నేర్చి శాస్త్రములసార మెఱింగి జగాన మేటి కో
విఁదుడని పేరుఁగాంచి సుకవిప్రకరంబులఁ దన్పవచ్చు, సం
పదలఁ జెలంగి సర్వవిధ భోగ్యము లందగవచ్చుగాని, మో
క్షదము నభీష్టదంబును సుఖప్రదముల్ శుభదంబునైన త్వత్
పదయుగ సేవలన్ బొరయు భాగ్యముగల్గునె? వేంకటేశ్వరా

తనువు కృశింపనీ భయము తారొఁటనీ హృదయంబు క్రుంగనీ
ధనము తొలంగనీ హితసుతప్రకరంబు నశింపనీ భువిన్
మనమున నీ పదాబ్జమహిమ మ్మొకసారి స్మరించినంత, త
త్తనుధన పుత్ర మిత్ర పరితాప మడంగదె! వేంకటేశ్వరా!

హరియన నీవెగా, హరుఁడ వన్నను నీవె, యజుండ వీవె భా
స్కరుఁడవు నీవె, తారలును చంద్రుఁడవీవె, నభమ్ము నీవె సూ
ముర హరుఁడన్న నా భువనమోహనమూర్తివి నీవె, వేంకటే
శ్వరుఁడన నీవెగా, కలుషసంహార, శ్రీపతి వేంకటేశ్వరా!౧౪

నిలుపుదమన్న నెందులకొ నిల్వదు నాదు మనంబు నీపయిన్
సలుపుదమన్న నీభజన సల్పఁగ, నీదు పవిత్రనామమున్
పలుకుదమన్న జిహ్వ పలుభంగుల దూషణసేయఁ జూచు నెం
దుల కిక నాదుజన్మమని తోఁచెడు పల్మరు! వేంకటేశ్వరా! ౧౫

కాశికిఁ బోవ నేమి యగుఁ గర్మవిమోచన గాని వారి క
త్యాశ జనింప విత్తమునకై పలుపాట్లను జెంది యెన్నియో
దేశములందు క్షేత్రముల ద్రిమ్మర నేమి ఫలంబొకో? దయా
లేశము లేని మూఢులకు లేదిల మోక్షము, వేంకటేశ్వరా! ౧౬

దోసము జేయ జంకదు బుధుల్ విరచించిన నీతిమార్గమున్
కాసయినన్ గణింపదు, జగజ్జనదోష కథాప్రసంగమే
చేసి మఱింత పాపమునె చెందును నాదగు చిత్త, మిట్టి య
భ్యాసము మాన్పి జన్మమును సార్థమొనర్పుము, వేంకటేశ్వరా!

క్షితిపయి జన్మమెత్తి బుధసేవల జేయగ లేదు, సాధు సం
తతి దనుపంగ లేదు, కులధర్మములన్ గణియింపలేదు, ఉ
ద్ధతి గలవారి సేవయె సదా ఘనమంచు దలంపనయ్యె, నే
ననుగాచెదో భువి, జగత్ప్రభు, శ్రీపతి వేంకటేశ్వరా! ౧౮

ఎట్టివిపత్తులంబడితి, నెట్టి విషాద పరంపరల్ మదిన్
బెట్టితి, దుఃఖవారినిధి వీచికలంబడి మున్గి తేలుచున్
గట్టున జేరియున్ మఱి యఘాతమునంబడిపోవుచున్, తుదిన్
బట్టితి నీదుపాదములఁ బాలనసేయుమి; వేంకటేశ్వరా! ౧౯

చెఱకును జున్ను మీఁగడయుఁ జిక్కనిపాలునుఁ బాయసంబు ఖ
ర్జురకదళీసుధాజ్యమధు చూతఫలంబులకన్న రుచ్యమై
పరగెడు తావకస్మరణ పామరులెట్లు గ్రహింత్రు, నీ పదాం
బురుహము బాయకుండుగతి బుద్ధినొసంగుమి, వేంకటేశ్వరా!

తాలిమి లోకజాలములఁ దన్నుదువొక్కట, నాగ్రహంబునన్
దూలఁగఁ జేసి సర్వము నధోగతిఁ ద్రోసెదు; శైల పంక్తులన్
కేల నమర్చి కందుకపు క్రీడలసల్పెదు, ఘోరమైన దం
భోళిని బట్టి దీ భువనముల్ తలక్రిందుగఁ జేతు విన్ని నీ
లీలలటంచుఁ దా దెలియలేరుగదా భువి, వేంకటేశ్వరా! ౨౧

లోకములోనఁ బుణ్యజనులున్ మఱి పాపులటంచు నుండగా
నీక, సమస్తకార్యముల నీయెడ నర్పణఁ జేసి మానవా
నీకము నెల్ల నీచరణ నీరజముల్ స్మరియించునట్లుగా
తేకువనిచ్చి పుణ్యమునఁ దేల్చగరాదొకో! వేంకటేశ్వరా!

ఎవరి పురాకృతంపు ఫలమెట్టిదొ, యట్టి శుభాశుభంబు సం
భవమగుగాని, యూరక శ్రమంపడజెల్లదు; సర్వదా సుఖం
బు వడయజూడగా ధరణి బోలునె ? 'తక్కువనోమునోచి యె
క్కువ ఫలమందగోరుటలు కూడునె?' శ్రీపతి వేంకటేశ్వరా!

ఒక గృహమందు దంపతు లనూన సుఖంబుల దేలియుందు, రిం
కొకట నహర్నిశంబును మహోగ్రవివాద మహాబ్ధిలో మనం
బు కలతజెంది మృత్యువును బొందగనెంచి కృశించుచుందు, రీ
'కకవికల'న్నియున్ భవవికారము లేగద! వేంకటేశ్వరా! ౨౪

పరులమనంబులన్ గలఁచి బాధలబెట్టుచు సంతసంబుచే
బరవశమందకుండ, గడు పాపుల జేరకయుండ, సాధులన్
దురుసులు బల్కకుండ, బరదోష కథాశ్రవణ ప్రసంగముల్
జరుపకయుండ నామనము జక్కగ దిద్దవె! వేంకటేశ్వరా!

వేకువలేచి కాల్యముల వేగమె తీరిచి, స్నానమాడి, సం
ధ్యాకలనాది కృత్యము యథావిధి దీరిచి, యిష్టదేవతా
నీకముఁ బూజలన్ దనిపి నిర్మలచిత్తముతోడ నుత్తమ
శ్లోక చరిత్రముల్ చదివి చూడగరాదొకొ! వేంకటేశ్వరా!

నదులు సరిత్పతిన్, సతులు నాథుని సూచికకాంతమున్ లతల్
పదిలముగాగ వృక్షముల బాయక యాశ్రయమందునట్లు నా
హృదయ మదేలకో పవలు రేలును నీయెడనిల్చి, ప్రీతి నీ
మృదుచరణాబ్జసేవలనె మిక్కిలికోరెడు, వేంకటేశ్వరా! ౨౭

ఘన దురితప్రసంగ ధనగర్వ దురాగ్రహ కృత్రిమ ప్రవ
ర్తనరతుఁడన్ దురాత్ముఁడనధర్మపథానుచరుండ,మూఢుఁడన్
జనకుఁడు పుత్రుదౌష్ట్యమును సైచి క్షమించెడురీతి నీవు న
న్ననయము బ్రోచుటల్ హృదయమందు నెఱుంగుదు; వేంక॥

శ్రీపతివీవు నీ చరణసేవన లబ్ధ విశేష శేముషీ
ప్రాపిత మోక్షమార్గమున భద్రము గాంచనివాడు జ్ఞానపుం
దీపికయై వెలుంగు రవితేజము నొల్లక యంధకారపుం
గూపమునందునన్ దిరుగుఘూకము గాదొకొ! వేంకటేశ్వరా!

## క్షేత్రచరిత్ర

ఈనగమున్ గుఱించి వచియించెదరెన్నియొ పుణ్యగాథలన్
వాని యదార్థ మంతయు భవాదృశులే తెలియంగనేర్తు, ర
ద్దాని నిటన్ రచించుటయె ధర్మముఁ బుణ్యమునంచు నమ్ముచున్
నే నది విన్నవించెద బునీతుని జేయవె! వేంకటేశ్వరా! ౩౦

ధాత సుషుప్తిజెందుతఱి ధారుణి గ్రుంగె, హిరణ్యలోచనుం
డాతఱి భూతలంబు గొని యప్డు రసాతల మేగె; నంతటన్
శ్వేతవరాహరూపమున శ్రీహరి రక్కసు జంపి వేగ నీ
భూతలమున్ యథాస్థితిని బొందగ జేసెను! వేంకటేశ్వరా! ౩౧

శ్రీహరియున్ వికుంఠమును జేరక యట్టిటుజూచిచూచి, సం
దేహమనస్కుడై ఖగపతిన్ గనె, నాతఁడు దెచ్చెనద్రి; న
వ్వాహన మెక్కి లక్ష్మియునువచ్చె ధరిత్రికి, మాని బృందము
త్సాహముతోడుతన్ బొగడసాగిరి వారల; వేంకటేశ్వరా! ౩౨

"భూజనులార! నీనగము బోలవు తక్కిన శైలముల్, సము
త్తేజితమై వెలుంగు; ఘనతీర్థములం దిది యగ్రగణ్యమై
రాజిలు, దీని జూచిన బురాకృత పాపచయం బడంగు; వి
భ్రాజిత సద్యశస్కులయి వర్థిలు డంచనె" వేంకటేశ్వరా! ౩౩

అంతసురేంద్రుడున్ శివుడు నాపరమేష్ఠి వరాహమూర్తిపై
స్వాంతము నిల్పి సంస్తవము సల్పగ శ్రీహరి మెచ్చి 'భూతలం
బంతట నీప్రదేశము మహత్త్వము జెందునటంచు జెప్పి, తా
నంత దిరోహితుండయె యథార్థము! శ్రీపతి వేంకటేశ్వరా! ౩౪

ఆచకితాబ్జనేత్ర కమలాలయతో హరి క్రీడ సల్పఁ గ్రీ
డాచలమంద్రుడు దీని; నురగాకృతి గన్పడుచుంటఁ జేసి శే
షాచలమంద్రుఁ; కిల్బిషచయంబుల బాపగ వేంకటాచలం
పై చనునంచు నీనగమహాత్త్వము నెంతురు; వేంకటేశ్వరా! ౩౫

భూమిసుతన్ దశాననుఁడు పొందగ లంకకు జేర్ప, నంత శ్రీ
రాముఁడు దండకాటవి విరామము లేక చరించి యొక్క నా
డీ మహనీయ శైలమున నీకపివర్గము గూడి మైత్రిమై
క్షేమముగా వసించెనని చెప్పగ విందుము; వేంకటేశ్వరా! ౩౬

అలివెలుమంగతోడ! భువి నాపద మ్రొక్కులవాడ! ఏడుకొం
డల పయినుండు ప్రోడ! భువనమ్ముల నేలెడివాడ! వడ్డికా
సుల గొనువాడ, ఓ భువనసుందర! శేషగిరీశ వేంకటా
చలపతి యంచు నీ భజనసల్పుదు రీభువి, వేంకటేశ్వరా! ౩౭

భూమిని భక్తు లీమొదటి మూడుయుగంబుల మోక్షమంద ను
ద్దామ తపంబుఁబూని హరి దర్శనమందగ జాలి రీకలిన్
నీమముతోడ భక్తిమెయి నిశ్చలతన్ హరిపూజ సల్పినన్
కామితముల్ ఫలించుననఁగా భువి విందుము, వేంకటేశ్వరా!

తిరుపతికొండపై విమలదీప సహస్ర రుచిప్రభావసా
గరమున స్వర్ణదేవళపు గర్భమునం దలివేలుమంగ భూ
సిరి లలనాకళత్రములచేత సపర్యల జెంది, దివ్యసుం
దరతరమూర్తివై వెలుఁగు దైవమనీవహహా! వేంకటేశ్వరా! ౩౮

మ్రొక్కినవారి బ్రోతువఁట, మ్రొక్కియు మ్రొక్కులదీర్చనట్టియా
మ్రుక్కడి మానవాళి కిల మోక్షమొసంగక, ఘోరబాధలన్
స్రుక్కగజేసి నీగిరినిఁ జూడఁగఁ దొందరజేసెదం టహాహా!
అక్కజమయ్యె నీదగుమహత్త్వము! శ్రీపతి వేంకటేశ్వరా!

నేరము జేసినట్టి యవినీతుల బట్టుక శిక్ష జేసియున్
క్షౌరముఁ జేసి రాచచెఱసాలల నుంతురు; రాజరాజులే
ధారుణి నీకు మ్రొక్కి మఱితప్పిన క్షౌరమెగాక ద్రవ్య సం
హార మొనర్తు వెట్టి కఠినాత్ముఁడవో గద! వేంకటేశ్వరా! ౧౧

తప్పునకొక్క శిక్ష యన ధర్మము; నీయెడ నట్టివారలే
తప్పొనరింపఁగాఁ బలువిధంబుల శిక్షలు; జుట్టుఁగోసియున్
గొప్పగ ద్రవ్యమున్ గొనియు కోరినవెల్ల గ్రహించి యంతపైఁ
* జెప్పునఁగొట్టి పంపెదవు చిత్రము నీకథ! వేంకటేశ్వరా! ౧౨

కడువడి నీదు కట్నముల గట్టగ యాత్రికు లెల్లవేళలన్
మిడిమిడి యెండలో నడలి, మిక్కుటమౌ చలిలోన, వానలో
దడిసియు గష్టమేయనక దర్శనమబ్బినఁ బొంగి, సాగిలం
బడి ప్రణతుల్ శతంబులిడి ప్రార్థన జేతురు; వేంకటేశ్వరా! ౧౩

ముడుపులు గొన్ని గైకొని యమూల్యసువర్ణమనోహరంబులౌ
యుడుపులు గొన్ని, రత్నఖచితోజ్జ్వల హేమవికారమైన పై

---

* శ్రీస్వామిసన్నిధిని కట్నము లన్నియునొసంగినపిదప సువర్ణ వికారమగు పాదరక్షలతో గొట్టి పంపుటాచారము.

తోడవులు గొన్నికట్నములతో గ్రహియించెదవయ్య, యెట్టిదో
పిడియిది? న్యాయమౌనె? అలివేల్లలనేశ్వర; వేంకటేశ్వరా!

అప్పుల జేసి మూఢజను లయ్యది తీర్పక కూట సాక్ష్యముల్
జెప్పి యనేక బాసలను జేసెద రీభువి; నీఋణంబులే
చొప్పున దప్పు? నంబునిధి జొచ్చిన, గానల డాగియుండినన్
దప్పవు, ముప్పువాటిలుట తథ్యము, శ్రీపతివేంకటేశ్వరా! ౨౧

శైలము లేటిపై వెలయు చక్కని సామివి, వేడ్కతోడ నా
శ్రీలలనామణిన్ సతిగ జేకొని, భూలలనన్ వరించి, నీ
ళాలలనన్ గ్రహించియు విలాసముతోఁ దుత లోకజాలముల్
పాలనసేయువాడవు కృపామతి, శ్రీపతివేంకటేశ్వరా! ౨౨

కలియుగమందు దైవమనగా నిక నన్యులు లేరు, లేరు, శ్రీ
నిలయుఁడ నేనె, సర్వమును నేనె, యథార్థము నమ్ము డిద్ది మీ
రలు ననుగొల్చి మోదమలరన్ మనుడీ భువినంచు, నేడుకొం
డలపయి నెక్కి సాటెదవు దర్పమెలర్పగ, వేంకటేశ్వరా! ౨౩

అలివెలుమంగ గూడుక మహావిభవంబున వింతదీపికల్
వెలుగగ భక్తుల య్యపరవిష్ణు వితండ యటంచు గొల్వగా,
కులగిరి సప్తకం బటుల కొండల నేడిఁటిపైన ఠీవిమై
విలసిలు నిన్ను జూడ మది వేడుక బుట్టెడు, వేంకటేశ్వరా! ౨౪

గోణము బెట్టు బాలురను గూడుక బోయెదు వింతకౌర్థిక
శ్రేణులు, చిత్రవాద్యములు, జెన్నలరారెడు నృత్తగీతముల్

రాణ దలిర్చు భోగములు, రత్నపురాసులు జూడ, నిత్యక
ళ్యాణముఁ బచ్చతోరణము నందెడు నీగిరి, వేంకటేశ్వరా! ౨౯

వెలగల భూషణంబులుభువిఁ గలవెన్నియొ, మేల్ దుకూలముల్
పలువిధరత్నసంచయము, స్వర్ణవిభాసిత వస్తువాహనం
బులు, సరిలేనిభాగ్యములు, భోగపరంపర లెన్ని యెన్నియో
గలుగ, శిరోజముల్ గొనఁగ గారణమే మొకో? వేంకటేశ్వరా!

కురుల నొసంగ దైవమునకుఁ గడు బ్రీతియటంచు నమ్మ, నీ
నరులు భవన్మహాత్త్వము మనంబున నెంతురొ లేదొ? వేంకటే
శ్వరుడె యథార్థదైవము, ధ్రువంబిది, దాసుల మేమటంచు ద
చ్ఛిరములు నీదు పాదములఁ జేర్చుట కాదొకొ! వేంకటేశ్వరా!

అడిగిన యాశ్రితావళికి నర్థమొసంగనివాడు, కల్గియుఁ
గడు నిరుపేదవోలె బ్రతుకంజనువాడు, జనాపకారియై
పడిమనువాడె యీభువికి భారము, భారతరంబుగాని, పే
రడవులు నబ్ధులుఁ గిరిచయంబులు భారమె? వేంకటేశ్వరా!

పౌరుషముఁ వివేకమును భవ్యచరిత్రము గల్గియుండు నా
పూరుషుఁడే ధరఁ మిగులఁ బూజ్యుఁడు, వానిదె ధన్యజీవనం
బూరక పొట్టకూటికయి యుర్వి జనింపగనేమి? వాయసం
బారయ నెంగిలిఁ మెసవి యాయువునిల్పదె! వేంకటేశ్వరా!

విభవముచే నొడల్ మఱచి వీగెడు వింత వికారపూరరా
సభనిభ దుష్టమానవ పిశాచము లెందుకొ? కోటిసూర్య స

న్నిభ నిన వేడఁగావలయు, నీవ యొసంగవలెన్; దిరంబులౌ
శుభములు గల్గి సంపదల జూఱగఁగొందుము; వేంకటేశ్వరా!

కడు ధనవంతుఁడయ్యు నుపకార మెఱుంగనివాడు, లుబ్ధతన్
బడి చరియించువాడు, నిజబంధుకళత్ర సుతాది కిష్టుఁడై
నడువనివాడు, భూతలమునన్ మనియుండిననేమి, ప్రాణమున్
విడచిననేమి? పాదయుగ నీచఖరంబుర, వేంకటేశ్వరా! ౫౫

ఇమ్ముగ గ్రంథమొండు పఠియింపగనేరని నోరు, ప్రేమతో
నమ్మనుబిల్చి యన్నమని యాడనినోరును, మిత్రబంధు బృం
దమ్ములఁ దమ్ములన్ గడుముదమ్మున బిల్వనినోరు ధాత్రిలో
గుమ్మరిమంటికై, తొలచు గుంటయెకాదొకో! వేంకటేశ్వరా!

బ్రతికిన వాల్గునాళ్లు నిజబంధు కళత్ర సుహృత్ సుతాది సం
తతి కనుకూలుఁడై ముదమునన్ జరియించుట మేలుకాని, ఉ
ద్ధతి నధికారజాడ్య జనితప్రమదాంధక దుష్టరోగియై
బ్రతికిననేమి ప్రాణములఁ బాసిననేమొకో! వేంటేశ్వరా! ౫౭

## కర్మాధీనత

పురుషుఁడు కర్మబద్ధుఁడు, స్వబుద్ధిని దాజరియింపలేడు, సం
గరమునగాని రోగమునగాని, జలాగ్ని మృగోరగాళిచే
మరణము నొందుటే ధ్రువము, మాన్ప సమర్థతగల్గినన్ జరా
మరణములన్ త్యజించి సుఖమార్గమునందడె? వేంకటేశ్వరా!

కర్మ మలంఘనీయమయి గాఁటియ బెట్టును, రాజరాజులౌ
ధర్మవిభుండు రాముఁడు సుధర్ముఁడు నానలుఁడున్ యయాతియున్
గర్మకు బద్ధులై సకల కష్టములం బడరే? ప్రజాళి యీ
మర్మ మెఱుంగ రెంత మతిమాలిన వారలొ! వేంకటేశ్వరా!

చదువుల నేర్చి వానిఁగల సారము సర్వ మెఱింగి మేటి కో
విదుఁడగు వాఁడు పేదయగు; విద్యయె లేని నిరక్షరాస్యు సం
పదలు తమంత జేరును, శుభంబులు వేలకు వేలు గల్గెడున్
మదిఁదలఁపోయ కర్మమహిమం బిది కాదొకొ! వేంకటేశ్వరా!

అతిధనవంతుఁడయ్యు నరుఁ డర్థి జనంబుల దన్పకుండ లు
బ్ధత మనియుండ నేల? కడుధార్మికవృత్తి చరింపబోఁడు; తా
నతి నిరుపేదయయ్యుఁ దన కబ్బిన యంతటిలోన నర్థిసం
తతికిడి తాసుఖించుట యథార్థము కర్మము, వేంకటేశ్వరా! ౬౧

*  *  *  *  *  *

విబుధులు చెప్పగా భువినివిందుము పూర్వయుగంబులందునన్
శబరిని గుబ్జ నాగుమలుని జాలగ బ్రోచితి భక్తు లౌటచే
ప్రబల నిదర్శనంబు లివి; భక్తిమెయిన్ మొఱవెట్ట ప్రోవ రా
వ? బరువ? నీపదాబ్జముల బట్టితి; శ్రీపతి వేంకటేశ్వరా! ౬౨

పాతకు డీతడంచు దలంపం జనునయ్య? సదా భవత్పదా
బ్జాతములందె నాహృదయ షట్పద మర్థివసించు, సర్వ ధా
త్రీతలమందు నిండిన త్వదీయ మహామహిమంబు నెప్డు సం
గీతము జేసి ఝుమ్మనుచు, గీర్తనసేయును, వేంకటేశ్వరా! ౬౩

భూతలమందు లోహచయముల్ పసరొక్కఁడు సోకినంతనే
ప్రాత స్వరూపముల్ విడి సువర్ణముగాఁగను మాఱు నట్టులే
పాతకి యైన నీమహిమ బాడిన నీపదముల్ స్మరించినన్
పూతచరిత్రుఁడై యశముబొందుటవింతయె! వేంకటేశ్వరా! ౬౪

## నా సికమతము

సకలజగంబు మానవ వశంబయి యుండగ, సృష్టికర్త వే
ఱొకఁడు గలండటంచును దురూహలలోబడి లేనిపోని న
మ్మకముల పాలుగాకుఁ డభిమానము నిల్పుడటంచు జెప్పు నా
స్తికులట! వీరిబోధనలు చిత్రములౌగద! వేంకటేశ్వరా! ౬౫

సకల చరాచరప్రకృతి సంపదగల్గు ధరిత్రిజూచి, తా
రకలసుధాంశు భాస్కర విరాజితమౌ గగనంబుజూచి, మౌ
క్తిక నవరత్న సంచయనిధిన్ జలధిన్ దిలకించి యెట్టి నా
స్తికుడును మూర్ఖతన్ విడిచి తేకువసందడె? వేంకటేశ్వరా !

సకల మనీషి దేవగణ సంస్తుతి భాజనమై, యనంతమై
ప్రకృతివిశాల వైభవ శుభంబగు నీ మహిమంబు నెట్టి నా
స్తికుఁడును జూచి సిగ్గుమెయి శీర్షమువంచి వినమ్రగాత్రుఁడై
ముకుళితహస్తుడై పడి నమో యనజెల్లదె! వేంకటేశ్వరా! ౬౭

కకుభములన్నిటిన్ విమలకాంతుల గప్పుచు సర్వదేవతా
నికర బుధప్రకాండముని నేతల కెల్లెడ మోక్షమార్గ తా
రకమయి ఘోరమౌఢ్యతిమిరం బడగించెను తెల్విదివ్వె నా
స్తిక జనమానసాళిగల చీకటిఁ బాపదె! వేంకటేశ్వరా! ౬౮

# శ్రీ వేంకటేశ్వర శతకము

## ప్రకృత దేశస్థితి.

ఈశమహాబ్ధివేష్టిత మహీజన కిల్బిషనాశ, దివ్య తా
రా శశిభానుమండల విరాజిత సంస్తుత సత్ప్రకాశ, స
ర్వేశ. మహాపవిత్రతర మహీధర శేషగిరీశ, సత్కృపా
వేశ విశేష, సాధ్వి యలవేల్లలనేశుఁడ, వేంకటేశ్వరా! ౧౯

యూరపుఖండమందున మహోగ్ర రణంబొకదుద్భవిల్లె, స
చ్ఛూరులు వేలు, లక్షలు వసుంధరపైఁబడి క్రుంకుచున్నవా
రా రుధిర ప్రవాహములు నా జన మారణ మారణోద్యమం
బారయ, నీ విలాసమకదా! పరికింపగ, వేంకటేశ్వరా! ౨౦

భారతయుద్ధమందు రటుపై మఱి రావణరామ యుద్ధమం
ద్రారయ దేవదానవ మహారణమందు గెవండు చూచె! నీ
ఘోరరణంబు నెన్న గడు క్రూర మపూర్వము నద్భుతంబునై
ధారుణి తల్లడిల్లెడు విధంబొనరించెను, వేంకటేశ్వరా! ౨౧

ఈనవయుద్ధపుం గతుల నీజననాశన మీ విచిత్రముల్
గానము నెందు, నీవిధము గల్గుట జూడగ గాలకర్మ సం
ధాన విశేషమో, ప్రకృతిధర్మమొ తోచదుగాదె! యింత నీ
యానయెగాక, యింకొకటియా పరికింపగ! వేంకటేశ్వరా! ౨౨

కానలగుట్టలం దిరుగగాగల 'టాంకులు' నభ్రమార్గమం
దైనను పక్షులట్లు తిరుగాడు విమానము లప్పుడప్పు డం
భోనిధి దాగి శత్రుబలముఁ పరిమార్చెడు నావలుంట నీ
యానయెగాక, యింకొకటియా పరికింపగ! వేంకటేశ్వరా! ౨3

భూనభముల్ దిశల్ పగిలిపోవగ మ్రోయు శతఘ్ని ఘోర దా
వానలమందు లెక్కకు ననంతములై పడు నశ్వజాలముల్
సైనిక జాలముల్ శలభజాలము లట్టుల; దీని జూడ నీ
యానమొగాక యింకొకటియా పరికింపగ ! వేంకటేశ్వరా! ౨౪

మానవనాథులెందఱో సమానవయస్కులతోడగూడి స్మే
రాననులై భయంకర మహానలకీలల దూటి శోణిత
స్నానము లాచరించుటలు చాల విచిత్రముగాదె! యింత నీ
యానమొగాక యింకొకటియా పరికింపగ? వేంకటేశ్వరా! ౨౫

మానిలయంబులై తనరు మందిరముల్ ధరగూలె, మేటి వి
జ్ఞానము నిచ్చు గ్రంథభవనమ్ములు భస్మములయ్యె, గొప్ప వి
ద్యానిలయంబు లూడె ధర నంత శవంబులునిండె, నింత నీ
యానమొగాక యింకొకటియా పరికింపగ? వేంకటేశ్వరా! ౨౬

సైనికబృందమెల్లెడల జచ్చియు రాసులనిండె, రాజ సం
స్థానము లెన్నొ యక్కట శ్మశానపువాటికలయ్యె, నింక నెం
దైనను జూడబోవ ప్రళయస్థితియే కనుబట్టె, నింత నీ
యానమొగాక యింకొకటియా పరికింపగ? వేంకటేశ్వరా! ౨౭

ఏనగరంబులో నయిన నెట్టెటులో మనియుండు మార్గముఁ
గానము, ధాన్యపుంధరలు గంతులువేసెడు, వస్త్రమూల్య మెం
తేనియు హెచ్చె, చౌర్యమును హింసయు సాగగజొచ్చె నింతనీ
యానమొగాక యింకొకటియా పరికింపగ? వేంకటేశ్వరా! ౨౮

కట్టగ వస్త్రముల్ కరవుగల్గె కనంగను నగ్గిపెట్టెకున్
కట్టెల కౌషధంబులకు కట్టకటా వెలహెచ్చె, దీపముల్
పెట్టుదమన్న తైల మసలే కనుపింపదు, జీవయాత్ర నిం
కెట్టుల జేయగానగు, మఱేగతి? శ్రీపతి వేంకటేశ్వరా ! ౨౯

ఒకధర ప్రొద్దుపొడ్పున మఱొక్కటిమాపు, మఱొక్కటంత, రే
పకడ మఱొక్కటీగతి నుపద్రవమై ధర హెచ్చి యంతకం
తకు మఱిహెచ్చి, హెచ్చుటయె,తగ్గుటయేకనబట్టదాయె, మే
మిక బ్రతుకంగలట్టి తెరువెయ్యది? శ్రీపతివేంకటేశ్వరా!౩౦

శకటము నెక్కువేళల బజారున వెచ్చముదెచ్చువేళ, కో
రికమెయి కాఫిద్రావి, సిగరెట్టును, కిల్లి కొనంగకొంత మా
రకము నొసంగినన్ దొరకరాదయె చిల్లర, చిత్రమేమొ? మే
మిక బ్రతుకంగలట్టి తెరువెయ్యది? శ్రీపతివేంకటేశ్వరా!౩౧

కొల్లలుగాగ చిల్లరను గూర్చియు కొందఱు సాహుకార్లు, వా
రొల్లరు నోటుకాగితము లొల్లరు రూప్యములన్, త్రిశుద్ధిగా
"చిల్లరలేని బేరములు చెల్లవు, పొండ"ని చెప్పి బేరముల్
చల్లగ మానుకొందు రతిసాహసమొప్పగ, వేంకటేశ్వరా!౩౨

పట్టణసీమలన్ విడిచి పల్లెలకేగి వసించు టెట్టులో
పుట్టినచోటు వీడి వనభూములలో జరియించు టెట్టులో
పట్టెడు తిండికై మొగమువాయగ నయ్యెను, జీవయాత్ర నిం
కెట్టుల జేయగానగు, మఱేగతి? శ్రీపతివేంకటేశ్వరా! ౩౩

ఇట్టి విపత్పరంపరల నెన్నిటి జూడగనౌనొ, మాకు ని
ప్పట్టున సౌఖ్యజీవనపు భాగ్యము గన్పడ దెందు జూడ, నే
పుట్టనొ గట్టనో కదిసిపోవగ నయ్యెను, జీవయాత్ర నిం
కెట్టుల జేయగానగు, మఱేగతి? శ్రీపతి వేంకటేశ్వరా! ౪౪

బట్టలు లేకయున్న తినుబండము లించుక లేకయున్న, ని
కష్టులపాలు జెందినను గల్గదుగా దయ లేశమేనియున్
కట్టవలెన్ త్వదీయమగు కట్నముఁ గానుకల, లేకయున్న మా
జుట్టునుగోసి సుంకము వసూలొనరించెదు; జీవయాత్ర నిం
కెట్టుల జేయగానగు, మఱేగతి? శ్రీపతి వేంకటేశ్వరా! ౪౫

ఈవిధి మానవప్రతతి యిండ్లు ధనంబుల నాలుబిడ్డలన్
బోవిడనాడి ప్రాణములబుచ్చగ నీయుగధర్మమో, లయం
బో, విధిప్రేరణంబొ, మఱిపుణ్యమొ, పాపమొకో, "వినాశకా
లేవిపరీతబుద్ధి" యన లేదొకొ పెద్దలు; వేంకటేశ్వరా! ౪౬

వానకు నెండకోర్చి ఘనవైభవమున్ విడి, బాంధవాళితో
గానకసీమ నాకులను గాయల భక్షణజేసి, వింత కౌ
పీనములన్ ధరించి మునివేషము లూనగజెల్లు, నింత నీ
యానయెగాక యింకొకటియా, పరికింపగ? వేంకటేశ్వరా! ౪౭

యాచితసర్వమానవ భవాబ్ధి విశోష, శ్రితప్రతోష, స
ర్వోచిత సర్వధర్మ విభవోజ్జ్వల భాగ్యవిశేష, చారుహే
మాచల సత్ప్రకాశ, మణిహార వినూత్న విచిత్రభూష, శే
షాచలవాస, గైకొను జోహారుల, శ్రీపతి వేంకటేశ్వరా! ౪౮

## హిందూమహమ్మదీయ సమ్మేళన

ధారుణి మ్లేచ్ఛరాజొకడు తా గొని తెచ్చిన విగ్రహంపు సం
బారము నెల్ల నొక్కయెడ భద్రము సేయఁ గుమార్తె బీబి నాం
చారి త్వదీయ విగ్రహము జయ్యన నెత్తుకపోయి, వింత శృం
గారమొనర్చి పూజల నొనర్చెన బాగద! వేంకటేశ్వరా! ౮౯

ఆరమణీలలామ హృదయంబును విగ్రహమందె నిల్పుచుఁ
"నారమణుండ, నాప్రియుఁడ, నాహృదయేశ్వర నీకె నాఁ నమ
స్కారములంచు" జెప్పనెడ సర్వము మ్లేచ్ఛవిభుండు చూచి, క్రో
ధారుణనేత్రుఁడై యట నిజాత్మజ కిట్లనె, వేంకటేశ్వరా! ౯౦

ఏరికి లేని సాహసము నీవిపరీతము నీకు గల్గె నె
ట్లో రమణీలలామయన ? "నో జనకా ! వినుమయ్య నామనో
హారి యితండు, నేనొరుల నంటను, పెండిలి సేయుమన్న, నాం
చారికి నీకు బెండిలిని సల్పిరి కాదొకో! వేంకటేశ్వరా! ౯౧

హిందువులుఁ ముసల్మనులు నేకముగా జరియింప దేశమం
దెందును లోపముండదని యేకముఖంబుగ నొక్కచెప్పగా
విందుము; మ్లేచ్ఛకాంత నల బీబిని పెండిలియాడి నీవు మా
కందుల మార్గదర్శకుఁడవైతివిగా భువి, వేంకటేశ్వరా! ౯౨

సందియమేల భూమిఁ గల సర్వము నీదగు సృష్టి, దాన నీ
కెందును బక్షపాత ముదయింపదు; తల్లికి దండ్రికెందు నీ
చందము గల్గునయ్యా? మము సాకెడు తండ్రివి నీవెగా, దయా
తుందిల, మమ్మనుగ్రహముతో దరిజేర్పుము, వేంకటేశ్వరా! ౯3

## భారతావని

శూరులు పోరిలో, బిఱుదు జూపని ధీరులునైన మేటి ఘు
ర్జర రసపుత్ర యోధులకు గాపురమై, సిరి కాలవాలమై
పౌరుషమే ప్రధానముగ భాసిలు మానవ వీరభూమి, మా
భారతదేశ గౌరవప్రపత్తిని నిల్పుము, వేంకటేశ్వరా! ౯౪

భూరిపవిత్రమౌ నదులు భూషలుగాగను, సస్యపూర్ణ కే
దారతలంబు లన్ని మెఱుఁదాల్చిన వస్త్రముగాగ, దివ్య కా
శ్మీర సుమప్రదేశములు శీర్షమునై విలసిల్లునట్టి మా
భారతదేశగౌరవ ప్రపత్తిని నిల్పుమి, వేంకటేశ్వరా! ౯౫

ధారుణిగల్గు దేశముల ధర్మనిరూఢిని, దైవభక్తి యం
దారయ మేటియై మకుటమై, సిరిసంపదలందు మిన్నయై
సారతరాత్మ బోధమున, జాలఁబ్రసిద్ధి గడించినట్టి మా
భారతదేశగౌరవ ప్రపత్తిని నిల్పుమి, వేంకటేశ్వరా! ౯౬

ఆర్యులకర్మభూమి, మన యాంధ్రనృపాలుర జన్మభూమియున్
మౌర్యులు గాకతీయులును మాగధు లేలినభూమి, శంకరా
చార్య, కబీర, నానకుల సాకిన భారతదేశ భూరియౌ
దార్యము నెంచి సంపదల దన్నుమి; శ్రీపతి వేంకటేశ్వరా! ౯౭

ఆరయ సంస్కృతంబున మహాకవియౌ నల కాళిదాసునిన్
భారతకర్తలైన కవివర్యుల నన్నయ తిక్కనాదులన్
ధీరుని బోతనార్యుని సుధీమణు లెందఱనేని గన్నమా
భారతదేశగౌరవ ప్రపత్తిని నిల్పుమి! వేంకటేశ్వరా! ౯౮

## ప్రస్తుత సాంఘిక స్థితి

అంటఁగరాని వాఁడెవఁడో? అంటగ నర్హుఁడెవండో చెప్పవిూ
తుంటరివై సదా జనుల దూషణ సేయుచు నీచవృత్తిచే
గంటకుఁడైనవాఁడో! యటుగాక యమాయకుఁడై ధరిత్రి ని
ష్కంటకుఁడై స్వధర్మమున గ్రాలెడువాఁడొకో? వేంకటేశ్వరా!

పరమపవిత్రముల్ సకలపాపహరంబులునైన దేవమం
దిరముల కేగి భక్తిమెయి దేవుని బూజల దన్పగోరు శ్రీ
హరిజన సంఘముల్ వెలసె, నయ్యది నీదు విలాసమే; భవ
చ్చరితముజూడఁజోద్యము నసాధ్యమునయ్యెను; వేంకటేశ్వరా!

వరుసయు వావి లేకయె వివాహము లయ్యెడు, వర్ణభేదముల్
మఱచిరి;సాలె జాండ్రకును మాలకు బాపనికిన్ వివాహముల్
తఱుచుగఁగల్గె; శాస్త్రవిహితంబొ, విరుద్ధమొ? యింక నింక నే
కరణి వివాహముల్ జరుగఁగాఁగలవో భువి? వేంకటేశ్వరా! ౧౦౧

పరిణయమందు వేదహిత భవ్యపురోహిత వాక్ప్రసంగముల్
కరము భరంబులయ్యె, చిరకాలముఁగాగల నృత్తమాది సం
బరము లడంగె, వేడుకలమాటలె కష్టము దోచె, నెట్టి సం
స్కరణమొ గాని పెండిలిపసం దడఁగెన్ భువి; వేంకటేశ్వరా!

పరిణయమందు దంపతులు పాయక చేయు విధిప్రమాణముల్
మఱచిరిపో; పవిత్రమగు మంగళసూత్రము గట్టకుండ నుం
గరములు మార్చు పద్ధతియె గన్పడె, శోభన దేవతాది సం
స్మరణమడంగె, పెండిలిపసందడఁగెన్ భువి! వేంకటేశ్వరా!

పరిణయకాలమందు జరుపంబడు పద్ధతులందుఁ బండితా
దరణమునందు సత్కవుల సత్కరణం బొనరించుపట్ల సం
స్కరణమె గాని, లోపములుగల్గునె తక్కిన పట్టులన్? వధూ
వరులకొసంగు శుల్కము లవంబును దగ్గునె! వేంకటేశ్వరా!

కలియుగ మిద్ది, దుష్టజన కల్పిత ఘోరకుతంత్ర కూపమౌ
కలి యిది, భూరిపాప నరక వ్యభిచార విపత్సముద్రమౌ
కలి యిది, జన్మమృత్యుభయగర్వవినాశక భీమదుర్గమౌ
కలి యిది, దీననెట్లు బ్రతుకంగలవారమొ? వేంకటేశ్వరా! ౧౦౫

కలియుగ మంతరించునెడ కల్క్యవతారము నెత్తి, పాప సం
కులమగు నీజగానగల క్రూరజనంబుల సంహరించి, దు
ష్కలుష మడంచి శిష్టులను గాచుచు ధర్మము నుద్ధరించు న
క్కలిపురుషుండవీవె, మముగావుము; శ్రీపతి వేంకటేశ్వరా!

సంకరమైన మహాదురితసంకుల మయ్యె జగంబు, దీని నె
ట్లింకను జక్కసేయనగు, నెవ్వరు దక్షులటన్న మా మన
శ్శంకలు వీడ, రక్షణము సల్పెడు దేవుడ వీవెగా "కలౌ
వేంకటనాయకో" యనుచు బెద్దలు పల్కరె? వేంకటేశ్వరా!

వరశుక శౌన కాంబరిష పార్థ పరాశర పుండరీక తుం
బుర ముచికుంద నారదులు పుణ్యులు భాగవతోత్తముల్ గదా
అరయగ మూఢచిత్తుడ మహాకలుషాత్ముడ నీదుదాసుడన్
దురితములన్ హరించి కృపతో భరియింపుమి, వేంకటేశ్వరా!

దురితలతాలవిత్ర పరితోషిత సజ్జనసచ్చరిత్ర, బం
ధురకరుణాపవిత్ర, నవతోయద సన్నిభగాత్ర, మాని హృ
త్సరసిజమిత్ర, దేవగణ సంస్తుతిపాత్ర, నవాబ్జనేత్ర, భూ
సిరిమహిళాకళత్ర కృప జిలుకుమి, శ్రీపతి వేంకటేశ్వరా! ౧౦౯

కాళిదయన్ సమగ్రముగ గాంచిరి పూర్వులు, దాననే మహా
కాళికులోద్భవుండ నల గంగమ వేంకయ తల్లిదండ్రి, నన్
హేళన జేయనొల్లక సహింపుమి, దాసుడ వేంకటేశుడన్
వైళమె దర్శనంబిడి శుభంబులొసంగుమి, వేంకటేశ్వరా! ౧౧౦

అరువదియేడు లాయువని యందురుగా కలిలోన, నల్వ దీ
వఱకె గతించె, జేసినది పాపమొ, పుణ్యమొ, యింకనైన నీ
చరణసరోరుహాసవ రసగ్రహణైక ధురీణచిత్త బం
భరునిగ జేసి నన్ను మనుపంగదె, శ్రీపతి వేంకటేశ్వరా! ౧౧౧

మంగళమయ్య నీగిరికి, మంగళమా భవదీయమూర్తికిన్
మంగళమయ్య నీభువనమానితదివ్య మహాత్మ్యశక్తికిన్
మంగళమయ్య నీవిబుధమండలసంస్తుత దివ్యకీర్తికిన్
మంగళమయ్య నీపురికి మాటికి మాటికి వేంకటేశ్వరా! ౧౧౨

శ్రీస్తనాంచిత కస్తూరీ । పంక సంకలితోరసే ।
పంకజాక్షాయ నాథాయ । వేంకటేశాయ మంగళమ్ ।

మంగళం మహత్

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ వేంకటేశ్వరార్పణమస్తు

## ఒకమనవి

చిల్లర లేదు లేదనుచు జిక్కులబెట్టుచు బేరసారముల్
కల్లదిలంగ సేయుటలు ధర్మమె, నైర్థికకోటి ద్రవ్యముల్
కొల్లలుగాగ కోశమున గూర్చితివే? భవదీయకోశముల్
చెల్లగవిప్పి చిల్లరనొసంగుము, శ్రీపతి వేంకటేశ్వరా॥



లక్ష్మీ పవర్ ప్రెస్, తెనాలి.